35

శ్రీరస్తు.

శుభమస్తు - అవిఘ్నమస్తు.

శ్రీగురుభ్యోనమః.

# శ్రీ సావిత్రీ దేవి చరిత్రము.

## సరస్వతీప్రార్థన.

కీర్తన.—రాజరాజ - రాజరాజ - వర్ణమెట్టు.

శారదాంబనన్ను బ్రోవుమిదియువేళ - నీకమునిన్నా - మనవకతలచెనను - వరములొసంగుమేమా - పరమపావనీచరణము ల - నమ్మితి - కరుణచెనమనుమా - శీఘ్రముగనాయెద - పరమభక్తి - తలచెదనెల్లపుడు - కూరిమి - శాంతము - సత్యము శౌచము - వారిక - నాకొసగిచేరె - రక్షించు - తల్లిరక్షించు - ప్రీతిగ - మన్నించు - మనవిక ॥శారద॥

## పార్వతీప్రార్థన.

కీర్తన.—సరోజదళనేత్రి - వర్ణమెట్టు.

తీర్థేశప్రియ శ్రీత్రిపురసుందరి - నీపదాబ్జములె సదాభజనజే సెదను - కృపయుంచు - వరంబులొసగే - పరమేశ్వరి - కైలాస మేరుసమయంచున వెలసినజననీ - శరణంటిని - పరాశక్తి శ్రీపార్వతి॥ తీర్థే॥ మందగామినీ - నుంచిరేశవతి - డెందమందున - నమ్మితిదే నేసి - పాదంబులే - ఆధారమనియుక - భక్తిచెలచెర - మోహ ములరగ ॥తీర్థే॥ చంద్రశేఖరు - నందమునాసే - కంమనూ - శను లాతను - అంబ - అందంమను - ఆధారమె - వెరగేటిశ్రీ - పార

శ్రీయశంకరి ॥తీ్థరే॥ కనకమయంబుగ వెన్కసుందర - కాంతిగల్లు రత్నములా - అంబ - ఘనముగను శ్రీలక్ష్మినీయిదే - కావువేడ్క - కాశికాపురి ॥తీ్థరే॥

కీర్తన.—నామొరాలకించిబ్రోవు-వర్ణమట్టు.

తల్లిదయయుంచు - కనకవల్లికల్పవల్లిరో - యుల్లమందున - నిన్ను కల్లగామనమ్మితినీ ॥తల్లి॥ భావమలర శేవజేతు - దేవిదయయుంచునాపై - కావుసువేగమేనన్ను - దేవదేవురాణివేడ్క ॥తల్లి॥ యోగిజనుల - హృదయమందు - బాగుగవసియించెజననీ - సాగిలి మ్రొక్కెదనిదే - వేగబ్రోవ - సమయమిదే ॥తల్లి॥ అఖిలజగములందునెల్లె - అంబాకృపయుంచుమా - అపరిమితిపాపములా నణచిబ్రోవు లక్ష్మినిపుడూ ॥తల్లి॥

లక్ష్మిపాట - యీరోడ్డుపట్టణం - వర్ణమట్టు.

సావిత్రిదేవిమహిమలెల్ల । సర్వము నెరిగింతువినుడీవేగా । భావములరగ పుత్సాహభక్తితో పణతులుత్తుడి । వేడుకగ ॥ మద్రదేశంబేలె యశ్వపతితనకు । పుత్రులు లేరని తపముచేయా । మద్రేశునకు సావిత్రీనిచ్చి దెవుడు । మంగళసౌభాగ్యములెల్ల నొసగె ॥ బాలచంద్రునిరీతి । బాలవర్ధిల్లుచు । మేలైనమంగళసూత్రము నకు । వాలాయముగనెడుకు । చూచుచుండగనపుడు । వచ్చెనునారదులు మోదముతో ॥ అపుడునారదుల రాకమెచ్చివేడ్క । ఆసనమర్ఘ్యపాద్యావిధులా । చపలాక్షిపూజించి నమస్కరించి భయభక్తియు బెనగొన నిలచియుండె ॥

తంగమే - అనువర్ణమట్టు.

అంతనారదులు యింతిత్రికరణశుద్ధి । కెంతయుమెచ్చి ॥ భయ

భక్తియుక్తాలికర్ । సంతసించిబల్కెనూ సావిత్రి । యిచ్చేనువర మిప్పుడు ॥

ముందిమీనాళ్ - వర్ణమట్టు.

వక్కమనవిసతులకెల్ల । పాతివ్రత్యముకన్నా । యెక్కువేదిశా లేమస్వామీ । చక్కగనాకొనగవలయుర్ ॥ స్వామి ధర్మబుద్ధ హింస । సత్యవ్రతం భూతదయ క్షమదమాది సంపత్తియు । సర్వ ము నెరుగించవయా ॥ పుత్రిజెప్పెదావిను । ఆత్మస్వరూపమైన వాడు । అతడే పతిభర్తయగుర్ । అతడేనాత్మారాముడగుర్ ॥ అ తనిరాకపోకలు ప్రణవాక్షర ద్వయమునిమెదరు । అతివ ఆ. అక్షర ద్వయమే సోహం - ఆసోహంబే అజపాయనుత్రము.

యీగోడ్డుపట్టణం - వర్ణమట్టు.

సాకార నిరాకారముల రెంటినేకముజేసి భక్తితోను । శోక త్రో వివిధ వుపచారములుగావించి । ఓంకారస్వరూపుడైన భక్తి మోదమలరి పూజింపుమనచు ప్రణవంబోదించినాద బ్రహ్మమును చూపి । ఆదరించి దీవించి నీతులుగొలిపి । అశ్వపతినిజేరి యిట్లని యెర్ ॥ మహరాజా । నీసుతకు వివాహకాలా । మాయెనెవరికి య్య । దలచితివనిన । సాహసంబునబల్కెర్ । సావిత్రితండ్రితో సత్యవంతునిదప్ప । యొండొరునిగోరర్ ॥ మునివిన్ని బల్కెను । తనయపసిదానవు । వెనుకముందెరుగక । నుడివెదవు । వినువత్సా రాంత । ముణకలిడు । జనును- ఘనముగ స్వర్గలోకమునకు.

ముందిమీనాళ్ - వర్ణమట్టు.

అనిచెప్పినారదులు జనెను నిజేచ్ఛగాను । మనుజేశ్వరుండు పు త్రిక । గనియిట్లుబల్కెనపుడుర్ ॥ వినుమాయువ్యంబులేనివాని గోరనేలతల్లి । అనువుగవేరొక్కపతిని । మనమలరగగోరుమనిన ॥

జనకుని-గని-బల్కెనపుడు మనమున నొకపురుషునిఁగోరి వెనుకవానిఁవ దలి యొరునియెంచునె పతివ్రతయౌతండ్రి ॥ గాననేను సత్యవం తుఁ । గానియొరునిఁగోరనిజము । పూనినామకర్త మెట్లుగానున్న నట్లుజరుగు ॥

తంగమెవర్ణమట్టు.

సాళ్వదేశాధీశున - సత్వఅడవులు వెతకి - సత్యవంతునిసాకు నూ - సావిత్రికి కళ్యాణము జేసెనూ రాజూ- కన్యాదానము జే సెనూ ॥ అత్తగారి తండ్రిగారిచ్చినసొత్తులు తండ్రికిచ్చి - అత్తమా మలకిచ్చి - నారదునిలో నిల్పెను చిత్తములరా - సావిత్రి నిల్పెను చి త్తములర । అత్తమామలకు భక్తియుక్తులుమీరగ - సంతృప్తిగా సేవజేసెనూ - సావిత్రి - భర్తనుప్రీతిగానూ । భర్తనుదేవుని గ భావించి యెల్లపుడు - పతివ్రతలిష్టాలచేసావిత్రి - ధాత్రిలో మెలగుచుండేఁ సావిత్రి ।

ముందిమీరాళ్ - వర్ణమట్టు.

దినములెంచూచుండెనపుడు- వనరుగనారదులువెప్పిన- దినము వచ్చెననుచు వేగవనమునకూ బయలుదేరె ॥ అత్తమామలాజ్ఞనొ న్ని - భర్తపుత్రస్య ప్రకారం - వత్తుననుచు బయలుదేరెఁ - భ ర్తవెంబడించితాను ॥ అడవిచేరి యిరువురును - ఆంనుభవించ లర యుచుండ - కడునొచ్చెను - తలయటంచు కాంత కౌగించెవిభుని కాలమృత్యునవచ్చెనంత - కంకణగట్టుకొని - చాలసావిత్రి కంట బడఁ - సతియు విభునిరేరముతనను ॥

యీాకోడ్డుపట్టణం - వర్ణమట్టు.

తొడపైనుంచుకొని - యోగాముజేయ - యమ-దూతాలు దగ్గరజేరలేక - ఖండించవెరచుచు - ధర్మాత్మునకుదెల్ప - కాలా

కొనుచు । సావిత్రీ । పతిని తోడుకొని ॥ ప్రాణేశ్వరి నేను । వనము న కలగంటి విధము చెప్పెదాను । వనితకో । వింతైన । వృత్తాంతము ॥ అనవినిపాణేశ । వినునీమతలిపంత్రముల్ । మనములచింతింపు । చేసేమహానంద । జేరబోదాం ॥ అనిబల్కి వేగమున తనవిభునిగూడి వేడ్క । మరుగనిజ ఆశ్రమం జేరగా । ఘనముగ నచ్చోటనూ ॥ అత్తమామలకు । నేత్రముల్ గానరాగ । చిత్రం బిదేమినేడు । మనసేత్రముల్ । కానవచ్చె ॥ యనుచునుయిరువురు । ఘనమైనబాలాచూపుల తనయుని యెదుర్కొనిరీ । వేగమున కోడలినీ కౌంగలించీ ॥ యింతపొద్దేలపోయె । యెరుగించు । దని బల్క నంతయు దెలియజెప్పే । సావిత్రీ। అత్తమామా। కెంతయు మోసముగా ॥ కన్నదివిన్న దెల్ల । అన్ని చెల్పు । కోడలిజూచి। చిన్నారిముద్దూగుమ్మా । సావిత్రీ । కన్నతల్లీవమ్మా ॥ మమ్ముగన్నతల్లివమ్మ । మాపాలిదైవము నీవని । మామాను అత్తయును కోడల్ని । మురిపమున । ముద్దుగొనియు ॥ పుత్రభిక్షమడిగిం । పుణ్యశాలివెనీవు । పూజ్యురాలవమ్మ । సావిత్రీయని । పొగడూచుండగను ॥ పోయినరాజ్యమెల్ల । హాయిగవచ్చిచేరె । బోయిచేరివేడుకా । నిజరాజ్యం । బాయకపాలించిరీ ॥ తండ్రికినూర్గురుసుతులు । తనకునూర్గురుసుతుల పొందుగ। బతిసేనుగాసావిత్రీ। పొంగి చెలంగెముగ్గా ॥

## ముందిమీనాళ్ - వర్ణమెట్టు.

లెఖ్ఖలేనియుగములనూ - చక్కగవెలిగేటితల్లీ - మక్కువచేకొలుతమమ్మా - అక్కరతో వేడరమ్మా ॥ యింద్రాదిదేవతులును పార్వతి మాహేశ్వరులును - చంద్రసూర్యకిన్నరులు - పరగబ్రహ్మసరస్వతియు ॥ వరప్రదులౌ లక్ష్మీవిష్ణు - పరమప్రీతితో పతిపార్శ్వంబున - శ్రీలక్ష్మికికరుణమీర - వరములొసంగిన

పాపసంహారా గోపాలబాల - శ్రీపద్మనాభ - భానజాఘుంధరభక్త జనమందార - శ్రీపతి సుకుమార - శ్రీధరగిరిధర ॥వీర॥ పంకజనాభం - పాలించు లక్ష్మి విదే ॥పంక॥ సంకటమారణా వెంకటరమణా - యింకనీదయరాదే వేదాంతపం వేద్య ॥వీరరా॥

కీర్తన.—వరములిచ్చిబ్రోవవమ్మ-వర్ణం.

వీరరాఘవ । వేడుకొంటివరములియ్యర । ధారుణియందువేరే వేల్పులేరువెతికినా ॥వీర॥ కనకవల్లిపాణినాథా । కనికరించుమా। వెనుకదియ్యకు నన్ను బ్రోవ । కనకసుచేలా ॥వీర॥ చక్కడవైదైవమనుచు । నిక్కముగాను । అక్కరతో వేడితినర। చక్కగబ్రోవురా॥ వీర॥ ధరనుసూత్రధారివైన వీరరాఘవ । కరుణచె శ్రీలక్ష్మిగావరా । కామితప్రదా ॥వీరరాఘవ॥

కీర్తన.—రాజీవముఖ రావె-వర్ణం.

పంకాజదళనేత్ర - నినుగనిన సంకటములుబాసి - చాలాసుఖంతురు ॥పం॥ చేరితినీకుపాదార విందములుకద - వేరుదిక్కుమరి లేదు నాకెవ్వరు - వీరరాఘువా - నినుకోరితిదేవా - నాపైకరుణ బ్రోవవావా పరిపరివిధముల - ప్రార్థించివేడెద ॥పంక॥ నెర నమ్మితినిశౌరి - మరువక నన్నేపుడు - నెదరుంచి కరుణించు - వర ముదయాకర - వరములియ్యర - నీశరణుజొచ్చితి - మరివెరువవల దనుచు వరదా - భయముబాసి వనజానాభుడబ్రోవు ॥పంక॥ జనని కనకవల్లి జనకుడవీవు నాకు - కనికరించుముస్వామి - మానివేకొలిచేగ - వనజలోచనా - శ్రీహోబాదికర వంశ - హరిమనుజాపాలా - మీరాశేయను బ్రోవను - తామసమేలను ॥పంక॥

కీర్తన.—ఏనుబేగత్తి-వర్ణం.

తామాసమేలరా - స్వామిబ్రోవరా - ఏమారకను నీకుహి

మలను మెల్లపుడు దలచెదనూ ॥తామ॥ చేంబలుభ్రమునర్ - వై స్కీ
వీరరాఘవా - మరినేరకానే చేసిన - దురితం వెదుగొట్టుమూ ॥తా॥
పురుషోత్తమనన్ను బ్రోవ - అరమరలేటికి - పరిసుమూకర నీకు శ
రణు శరణిదో ॥తామ॥ ప్రణవస్వరూప - పరబ్రహ్మస్వరూపా - గ
ణుతింపగ - అణువై మహత్తై గా న్పింతువుదే ॥తామ॥

కీర్తన.—గౌరీపన్నీరుచల్లరే-వర్ణం.

కాంతాకగణించరాదా - చింతనంతము చేసి - కాపుము గా
సత్యస్వరూపమై నిత్యమై వెలిగేతల్లి - సర్వాంతర్యామియైన పూ
తోకూడి ॥కాంత॥ బంగారుతల్లి రంగనాయకినిన్ను పొంగుచుసే
వ - శ్రీరంగనిరాణివైన ॥కాంత॥ చెంగావిచీరగట్టి శృంగారమొ
ప్ప మరిని చెంగల్ జార - గానమోహనాంగిగో - లక్ష్మినీ ॥కాంత॥

కీర్తన.—కరికనల్-వెళాదొంగుం-వర్ణం.

రంగనాయకునిరాణీ - పొంగి సేవితిమది ॥రంగ॥ మంగళాంగి
యైన - శృంగారవల్లితల్లి - సుమంగళితనమిచ్చి - సుందరినర్ బ్రో
వు ॥రం॥ పన్నీరుచేతనే - పాదపద్మములుగడిగి - స్వర్ణపుష్పములర్
ఘనధూపాదీపములర్ - మనమలరపూజింతు ॥రం॥ పంచభక్ష్యా
రమాన్నంబుల్ - షడ్రుచులొ గైకొను మిదె - హెచ్చైనవిడమం
దుకో పచ్చకర్పూరారతి - అచ్యుతునిసతి యందుకో ॥రంగ॥

కీర్తన.—నరహరినంబిదే-వర్ణం.

మనసు తెలుసుకోనా - మహిమలిట్లుచేసెదా - నామనసు తె
లుసుకోనా ॥ మహానుభావా నీమహిమ తెలుపనాతరమా ॥మనసు॥
కుక్షినిలోకంబులిడి - రక్షణచేసేటిదాతా - నక్షముసంపన్న సుహా
లక్ష్మినిడి వేడుకగా ॥మన॥ సృష్టికర్తవై నసేవ్య - సృష్టిమాష్టాలచే
శిష్టజనసేవితనా - కష్టము బాపేపార ॥మన॥ కనకవల్లినాయక - కని

కరమింత్రైసత్రేదా - అనఘాత్మాలక్ష్మిమొరల్ - వినరాలేదేనీకు ॥ మనసు॥

కీర్తన.—కోపమేలనే-వర్ణం.

కోపమేటికే తల్లీ । పాపహారిణిదేవి ॥కోప॥ దాపునజేర్చునా । పాపంబులణచి । నీపాదమూలిపద్మ కాపాడుమమ్మా ॥కోప॥ శ్రీలక్ష్మినాపై చాలదయాయుంచు । పాలకడలి పుత్రికనన్నేలుము సన్నుతాంగి ॥కోప॥ జ్ఞానదాయినీ । కనకవల్లితాయీ । పూనికచేలక్ష్మిని । కనికరించికావుమా ॥కోప॥

కీర్తన.—కాత్తారుళ్ వాయి-వర్ణం.

అత్తార్ పన్నీరుర్ పున్గుర్ చెందనమందుర్ జేర్చి బాగా- చిత్రమైన మెత్తామీద - జేరిశౌరి అలదేర్ ॥అత్తా॥ కర్పూరతాంబూలములిచ్చేర్ - కామినీ - ఓరాఘవునకు - కనకవల్లినంతట గౌరవమును మీరవక్షమందునజేర్చె - వయ్యారంబుగాను - మురిపముతోడ మోహనాకారునకుశౌరి ॥అత్తా॥ వేణునాదము కృష్ణుదూదెనూ - అందముమీరయమునాదనుంతూ - డెందముపొంగా సుందరాంగీతోను - శృంగారసంగీత మంగళములుపాడ - పొంగుచునేలెను - లక్ష్మినిరాఘవుడు శౌరి ॥అత్తా॥

కీర్తన.—నలుగీడవాఙంసామి-వర్ణం..

దయలేకపోయెర్ దేవా । దయలేకపోయెనుగా । ధర్మమానాపై । పుట్టిననాటనుండి । పట్టిగాబ్మిరీతే । పట్టితినీపాదములను । గట్టిగాస్వామీ ॥దయ॥ ఏటిమోచేదా । ఇంకా । యాదవాంబునిచూదారి । వాసిసులనాతోనూ । గాఢముగకా ॥దయ॥ ఘనవీరరాఘవనాపై । కనికరముంచులకు । వినుకనిశేలదేమి । అనిశము లక్ష్మిపై ॥దయ॥

కీర్తన.—నల కూశురాదానాశ్వధి నంనకుమ్మ—వర్నం.

వరదానయ యోచుటకు । మాచీనానేలా । నీరాఘవానీకు భారమైతినా ॥వర॥ భక్తులాదాగనిన్ను బాధించియున్నారా । వైద్యాపథములు । నీవు వెతుక బోతివా ॥వర॥ గోపికలాచేలము। లపహరించబోతివా । గోపాల । గోవులను మేవ బోతివా ॥వర॥ చిరకాలసఖు కుచేలుణ జూనబోతివా । వీరరాఘవానన్ను । మ రచిపోతివా ॥వరదా॥

కీర్తన.—ఎంగెనిపోనే-వర్నం.

పంకజనాభా పరిపాలించూనన్ను । సంకటముల్ దీర్చు వేంకట రమణా ॥పం॥ యేడూకొండాలవాడా వేడుకొంటినిన్నూ । చేకి య మంగతాయుణ । గూడికన్ బ్రోవుదేవ ॥పం॥ పద్మావతీనాథా। పాండురంగానీ । పాదాబ్జములను కోర్చు।పాపసంహారానన్ను ॥పంక॥ పరమాత్మశావుమా । పరతత్వమెరుగించి । పరమపురుషపాకి ప్ర హ్లాదరక్షకా ॥పంక॥

కీర్తన.—విరులూకో తాముర రె-వర్నం.

శరణుశరణుదేవా । శరిగాచికట్టి శ్రీశ వీరరాఘవ ॥శర॥ పల్ల వాధరనీమ । పాదాబ్జముబిన్నూ । కల్లలుగాగనాయుల్లమున న మ్మితీ ॥శర॥ రామపరా కేల । స్వామినన్నుబ్రోవసి । నామారూపా ములకు వేమారుమొక్కితీ ॥శర॥ పన్నగశాయి హరి శ్రన్నబ్రో వునన్ను । సన్నుకగాశ్ర ఆపన్న । శరణ్యాకంద్ర ॥శర॥

కీర్తన.—రాజావా-నటరాజానీవా-వర్నం.

నాథారంగనాథా । ననుబ్రోవరాదా । కరుణాలేదానాపై ॥ పాదారవిందములే । ఆధారమనియున్న । ఆదరించవేల శ్రీధరా మాధవా ॥నాథా॥ లక్ష్మీమనోహార। అక్షయసుఖకర పక్షి వాహన

యేరా - త్రిశక్తిస్వరూప - మోక్షదాయకనన్ను - రక్షించుమ్రొక్కి మునిసార - పశుపాలమువలదు - శ్రీవత్స - వనమాలాధారా ॥నా॥ ఆదిమధ్యాంతరహిత - హేదయానిధే - సాధుచిత్తాబ్జవాసా - సర్వలోకాధారా - భేదమెంచబోకు - యాదవనందన - మోదమొసంగుమో యాదినారాయణ ॥నాథా॥

కీర్తన.—కారుణ్యమయనిత్య-వర్ణం.

అంతరమందు । నేనెంతవేడిన । తంద్రీచింతాదీర్ఘవునాదమూ । యెంతవేడుదునిన్ను । పంతమేలనాతో । శ్రీకాంతానీవైన । జప్పరాదా । అనంతునికి ॥అం॥ ద్రౌపతికతీయ । వలువలొసంగిన। ధర్మిష్టినీవేకదా । శ్రీపతిధృవునికి । మోక్షపదవియిచ్చి । చేరిగజేంద్రమనీ । చేపట్టినస్వామీ ॥అం॥ అహల్యశాప । విమోచనజేసిన । అచ్యుత । ననుకావవా । ప్రహ్లాదునీకీ అభయమొసగి. దేవాప్రజలాను । రక్షించే । నరశింహానినునే ॥అంతర॥

కీర్తన.—నలుగూతురారాసామి-వర్ణం.

మరియాదకాదుమారీ - మరిమరివేడుచున్నా-మరి - కరుణాగల్గదేమి - కరిరాజరక్షణ ॥మరి॥ చిరకాలమూయ్యోనిన్ జేరివేడుచుండ - మరచితివేమినన్ను - నరహరినమ్మియుండ.॥మరి॥ దానధర్మములుజేయూ - ధనమునిండుగలేకు - గానముచేతనిన్ను - వర్ణనజేయుచుండ ॥మరి॥ తీర్థయాత్రాలుజేయూ నేనను దేవాదేవా. కీర్తనాలాతోనిన్ను పలుమాటుపిలువ ॥మరి॥

కీర్తన.—రారారారా-రఘురామువలుగుకు-వర్ణం.

। జననీనామనవిని । జనకునకెరుగించి । నను జేరదియ్యావే । కనకవల్లిశృప జననీ॥ లోకమాతవని । ఖ్యాతిజెందితివమ్మ । సాకేతపురి తాజాతు । చెప్పుదా దేతల్లి ॥జననీ॥ కనికరముంచియు కనకవల్లి నాపై

ఘనుడౌ రాఘుపుత్రనాకు । కరుడాగలిగెటు జెప్ప ॥జన॥ చేరిదాపితికీ పొరలావంగిన । యారజనకుని చెంత । చేరిమోదముగల్ల ॥జన॥

కీర్తన.—పట్టణత్రితోవందాళాడి-వర్నం.

పండరివాసనీ - యంతజేరితి - అండాండ పిండాండ బ్రహ్మాండనాయక ॥పం॥ సంసారాటవినన్ - ధ్వంసము చేయుచున్నది - హింసాపడనేరక - నినునెరనమ్మితి ॥పం॥ మాయావిరహితమాధవ నను బ్రోవు - మంగళకాంతౌరి నమ్మినే ॥పం॥ ఆపద్బాంధవ నీదావుకేరితి కాపాడిరక్షించు - శ్రీలక్ష్మిని ॥పం॥

కీర్తన.—పాండురికీర్తిధరా-వర్నం.

నేరము లెంచకుమీ నరహరీ ॥నేర॥ పాపములేని పాపములను జేసి - జేరితిసీచెంత్రి - పరాత్పరా ॥నేర॥ దుష్టురాలనచుననన్ను - బ్రోయవలనుస్వామీ - కష్టము బాపేటికృష్ణానాపై ॥నేర॥ పన్నగశయనా - పాపవిమోచన - క్రన్నన బ్రోవవయ్యా శ్రీలక్ష్మిని ॥నేర॥

కీర్తన.—దేనీప్యమాన-వర్నం.

సీతాపతేనా సంచితా - పాతికా - హరిణా - వేదరూప - విశ్వకర్త - ఆకరించినా ॥సీతా॥ నీకన్న ప్రభువులెవ్వరీ- లోకమందునా సాకేతపురీ - వాసవేగబ్రోచినా ॥సీతా॥ భక్తులయాపదలను । బారదోలియు - నిత్యానంద - మొనగుమువు - నిర్మలాత్మకా ॥సీ॥ హారినిమ్ముదలచని - పరజన్మమెందుకు - నారాయణా - నమ్మితి శ్రీలక్ష్మిపూజితా ॥సీతా॥.

కీర్తన.—భోజనంకయ్యావారుంగో-వర్నం.

వచ్చెమాదిన్నికృష్ణుడూ । గోపికలందరుగొల్వగ శ్రీతిజ ॥వ॥ పున్నమచంద్రుని బోలుమోముతో । తిన్ననిపదకల విశ్వదేహుడు న । తళతళమనిదొంటి । హారహారముల్ । వెలుగుచుండును । వచ్చె।

కుచ్చులును । నిగనిగ మెరిసెడు పీలపులోంచె [illegible] ధగధగ మెరిసె

టి దండలునిండుగ । కడలుచుసుండె [illegible] । పలచనిపవ

లచే తొలుగజ్జెలును । మరకతములసరి మకరకంఠిణు । వరుసము

త్యపు హారముల్ మెరయగ । ఘనపుష్యరాగ బాజిబంతులు । కన

కమయమగు కంఠహారముల్ । మణులుచెక్కిన ముక్తికహారము

ల్ । మాణిక్యమ్ముల మేల్ మేల్ సొమ్ములు । గోమేధికముల వుత్త

ర జంధ్యం । కమలాల్ చెక్కిన గాజుగొలుసులు । బంగారంబుల

వుంగరంబులు । శృంగారంబగు పాదసరములు । నవరత్నమ్ము చె జె

డబంగారం । జవమణు ల్పొదిగిన చెంపటీకాలు । సొంపగు ఆణి

ముత్యంపు పోగులు । కెంపురవలతో జంపుల్ జుమికీలు । అచ్చ

మైనబహు పచ్చలకొప్పె । హెచ్చుముత్యపు నెమలికుంచెయు -

వజ్రాలమర్చిన రెట్టబిళ్లలు । గజ్జలందెలు ఘలుఘల్ మ్రోయగ।

మందహాసవదనారవిందముచె । నందనందనుడు లక్ష్మినిజూచెనగ ॥వ॥

గద్య—ఇదిసద్గురువరుని యాజ్ఞానుధారిణియు

భక్తజన పాదారవింద మకరంద - పానా

సక్తచిత్తయగు శ్రీలక్ష్మీయను

భక్తురాలిచే - రచియింప

బడిన శ్రీవీరరాఘవ

నామ కీర్తనలు

సంపూర్ణం.

---

కీర్తన.—శ్రీనివాసాదయానిధే శ్రితజనపోషా కృపానిధే॥ దు

ష్టసంహరణ - యతిజనపోషణ - విజ్ఞానప్రపవిభుధపాలనా ॥శ్రీని॥

పరమపావన పాపనివారణ - పరాత్పరా హరే - పరంధామమ్మిరే ॥

శ్రీ నందనందనా - నాగసుశయనా - బృందారకగోవిందమురారే

శ్రీ కంసహరణా - కౌస్తుభభూషణా - వక్షస్థలశ్రీవనమాలా ధర॥

శ్రీని॥ భక్తపాలకా - భుక్తిదాయకా - భక్తిచేగొలచిన పన్నగ
శయనా ॥శ్రీని॥ గానమోహనా గరుడవాహనా - దీనావనదేదీప్య
విగ్రహా ॥శ్రీని॥ కరుణాసాగరా కటాక్షముంచర - హరిపరమాత్మా
నెరనమ్మితిమది ॥శ్రీని॥ మకరకుండలా మణిమయభూషా - సకలా
త్మక శేషాచలనిలయా ॥శ్రీనివాసా॥

కీర్తన.—శ్రీ వెంకటాచలపతీ - ననుబ్రోవర శ్రీపతీ - భావంబు
నందున పలుమారు ప్రార్థింతు ॥శ్రీ॥ ఆపదోద్ధారక - అఖిలజగద్ర
క్షకా పాదసీకంటె ఘనులెవ్వరున్నారు ॥శ్రీ॥ కరుణతో గజరాజు
ప్రేమబాపి మకరిని - శిరము ద్రుంచి భక్తవరులను బ్రోచిన ॥శ్రీ॥
మత్స్యావతారమై మున్ను - సోముని ద్రుంచి - సొచ్చైన వేదము
లు తెచ్చి అజునకిచ్చిన ॥శ్రీ॥ కూర్మావతారమై కూర్మి పనధి ద్రచ్చి -
నిస్తులమగు సుధను నిర్జరామలకిచ్చిన ॥శ్రీ॥ వరహావతారమై వసుధ
జాపగజట్టి - హిరణ్యాక్షుని - ధరిగూలనేసిన ॥శ్రీ॥ పరమభక్తు
డైన ప్రహ్లాదు బాధించు - హిరణ్యకశిపుని - హింసించి ద్రుంచిన
॥శ్రీ॥ అమరేంద్రునకు రాజ్యమొసగింప బలిబూని క్రమమున మొప్పు
జరికె వాతాళమిచ్చిన ॥శ్రీ॥ పరశురామనామ పరంధామమూర్తివై
ధరణీసురులకు భూదానమొసంగిన ॥శ్రీ॥ దశరథసుతుడవై - దశ
కంఠుని గెల్చి - ననుధహయమేధములు - వరగ చేసితివి ॥శ్రీ॥ వ
సుధలో దేవకీవసుదేవులకు బుట్టి - పసులగాచి కంసుని - బరిమా
ర్చితివి ॥శ్రీ॥ పరమభక్తులకెల్ల వరములొసంగుచు - పరిపాలించు
చున్న - బౌద్ధావతారా ॥శ్రీ॥ వెంకటాచల ధ్యాసు కష్టములు తెగ
బాపె - శంకరనుతహరీ - శౌరీ పరాత్పరా ॥శ్రీ వెంక॥